



వేమూరి వేంకట రామనాథం




ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి

1982

# సన్మతి

వేమూరి వేంకట రామనాథం




ప్రచురణ:
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
1982

SANNUTI

by

VEMURI VENKATA RAMANADHAM

T. T. D. Religious Publications Series No. 139

*First Edition* : **October 1982**

Copies : 5000




*Price* : *Rs.* 2–00




Published by

Sri G. Kumaraswamy Reddy, I.A.S.,
EXECUTIVE OFFICER,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

*Printed at* :

Tirumala Tirupati Devasthanams Press,
Tirupati.

# ముందుమాట

ఆంధ్ర సారస్వత రంగంలో పురాణేతిహాస కావ్య ప్రబంధాలతోపాటు శతక సాహిత్యానికి కూడా గణనీయమైన స్థానం వున్నది. బహుళ ప్రచారంలో ఉన్న సాహిత్యం కూడా ఇదే అనడం సత్యదూరం కాదు. శ్రీకాళహస్తీశ్వర దాశరథి శతకాలు ఈ సత్యాన్ని నిరూపణ చేస్తాయి. సుమతి శతకం, కృష్ణశతకం, వేమనశతకం — వీటిలో ఒక పద్యమైనా నోటికిరాని తెలుగువారు వుండరని నిస్సందేహంగా చెప్పవచ్చు.

శతక రచనకు ముఖ్యోద్దేశం భగవన్నుతి. భక్తిజ్ఞాన వైరాగ్య ప్రబోధం; నీతిధర్మతత్త్వప్రచారం.

శతకానికి సంఖ్యానియమంకంటె మకుట నియమం ప్రధానంగా కనిపిస్తుంది. కాని మకుట విరహితంగా శతక ప్రాయాలైన రచనలుకూడా లేకపోలేదు. 'సన్నుతి' అనే ఈ స్తోత్ర గ్రంథం ఆ కోవలో చేరుతుంది. శ్రీనివాసస్తుతి పరమైన ఈ పుస్తకంలో — కొండ, సుప్రభాతం, ఆదివరాహుడు, విమాన వేంకటేశ్వరుడు, తిరుపతియాత్ర — ఇలాంటి ముప్పైఆరు శీర్షికలున్నాయి. ఇవన్నీ శ్రీ వేంకటేశ్వరుడికి సంబంధించిన భక్తిమయ రచనలు; అనుభూతి రుచిరాలు.

భక్తుడు శ్రీనివాస సందర్శనార్థం కొండ మెట్లెక్కి ఆలయం చేరడం, స్వామి పుష్కరిణీ స్నానం, ముందు వరాహస్వామి తరువాత శ్రీనివాసస్వామి సందర్శనం, అర్చన, హారతి — ఈ వైభవాలూ, ప్రాభాతిక వేళలో తిరుమల ప్రకృతి శోభానుభవం రచయిత శ్రీ వేమూరి వేంకట రామనాధంగారు తమ 'సన్నుతి'లో ఎంతో హృద్యంగా వర్ణించారు.

తి. తి. దేవస్థానంవారు హిందూ ధర్మప్రచారానికి చేపట్టి
బహుముఖ కార్యక్రమాలలో వేదవేదాంగ రామాయణ భార
భాగవతాది ధార్మిక గ్రంథాలను విరివిగా ముద్రించి స్వల్ప
మూల్యానికే ప్రజల కందించడం ఒక భాగం. తదనుగుణంగా
ప్రచురించబడుతున్న ఈ 'సన్నుతి' భక్తుల ఆదరణకు పాత్ర
కాగలదని మా విశ్వాసం.

తిరుపతి,
అక్టోబరు 7, 1982

జి. కుమారస్వామిరెడ్డి
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానము

శ్రీః

# అభినందనము

మిత్రులు ఆచార్య రామనాథంగారు రచించిన సన్నుతి యను శ్రీవేంకటేశ్వర స్తవ పద్యకుసుమ స్తబకము నందలి ప్రతి పుష్పము సౌందర్యము కని, సౌరభము నాని, మకరందము నాస్వాదించి యిందిందిరమువలె నమందమైన సానంద పారవశ్యము నొందితిని. జగద్గురు శ్రీశంకరాచార్యులవారు శ్రీదేవీ పాదరజమును జడులకు చైతన్య స్తబక మకరంద స్రుతిఝరి యని యుగ్గడించి యుండిరి. మకుటము లేకున్నను శతకమని చెప్పదగిన యీ సన్నుతిని చదివి నప్పుడు నా కాచార్యులవారి యా వర్ణనము జ్ఞప్తికి వచ్చినది. ఇందు ముప్పదియారు శీర్షికలున్నవి. అందలి పద్యములు కొన్ని వర్ణనాత్మకములు; కొన్ని అనుభూతి పూర్ణములు; కొన్ని భక్తిపారవశ్యపర మావధులు. "ఎప్పడి యూహాలప్లై పదహృద్యత భావ నిసర్గలీలమై చెప్పితి వృత్తసంకలిత శృంఖలముల్ దవిలించి" అని వారు 'రచన'లో వ్రాసియుండిరి. ఆ వృత్తములు శృంఖలలవలె లేవు; భక్తులైన పాఠకులకు రసానంద శ్రీపాదతీర్థమునందిచ్చు శంఖములవలె నున్నవి. మధుమాసమున నన్ని లతలును పుష్పించును. ఆ పువ్వులందొక్కొక్క దాని యందొక్కొక్క సౌరభ విశేషముండును; ఒక్కొక్క లాలిత్య వైభవము గోచరించును. అన్ని పువ్వులొకే రకమునకు చెందిన వైనచో ఆ విరిగుత్తి యందు సౌరభాధిక్య ముండునుగాని వైవిధ్య ముండదు. ఈ సన్నుతి సౌరభ వైవిధ్యముతో కూడిన అపూర్వ పుష్పగుచ్ఛము. ఈ గుచ్ఛము ధరించినప్పుడు స్వామి ఎంతగా మురిసిపోవునో !

తెలుగున నున్నన్ని శతకములు మఱే భాషయందును లేవు. వాని సంఖ్య యెనిమిది వేలకుమించి యుండును. వానిలో కొన్ని భక్తిమయములు; కొన్ని నీతిబోధకములు; కొన్ని తత్త్వప్రచారక ములు; కొన్ని వ్యాజస్తుతి పూర్వకములు; కొన్ని కథనాత్మకములు. ఈ సన్నుతి యందా వైవిధ్యమంతయు గోచరించును. ఆదివరాహుడు, గోవిందరాజు మున్నగునవి స్వామి చరిత్రను జ్ఞప్తికి తెచ్చును. జీవ బ్రహ్మైక్యముకంటె గొప్ప తత్త్వభావన మఱొకటి ఉండదు. శ్రీరామ నాథం గారా యైక్యమును వాంఛించు పద్యము లిందెన్నో యున్నవి. వారు నీతి నిందు వాచ్యముగా చెప్పియుండలేదు. పూలలో వాసన వలె నది ప్రతిపద్యము నందంతర్గతమై యున్నది. ఆదివరాహుడను శీర్షిక యందలి పద్యములు వ్యాజస్తుతికి తార్కాణములు. ఇంక భక్తియందమా, యిందలి పద్యములన్నియు భక్తిరస సముద్రములు. ఆంధ్రమున శ్రీకాళహస్తీశ్వర, దాశరథి శతకములు భక్తికి పేరందినవి. ఆధునికుల శతకములలో భక్తచింతామణియు, విశ్వనాథవారి మా స్వామియు భక్తిరస భావసంపద యందగ్రగణ్యములు. ఈ సన్నుతి ఆ శతకముల కోవకు చెందినది. ఒక్క భక్తి భావమునే దృష్టి యందుంచుకొన్నచో దీనికి కనిష్ఠికాధిష్ఠతయే లభించును. శ్రీరామ నాథంగారి భక్తి నిష్కామమైనది. "యస్త్వా శిషమాశాస్తే న వై భక్తః స వైవణిఙ్"క్కని ప్రహ్లాదుని భావము. భగవద్గీతయు నిష్కామ కర్మమునకే ప్రాధాన్యమిచ్చును. "ఏదియో కోరికమై నినున్ దరియ కుండెడు విజ్ఞత నీయవా, భవత్ శ్రీరుచి సిద్ధియే తనివి తీరని బుద్ధిగ చేయవా ప్రభూ" అని వారి కోరిక లేని కోరిక.

సాధారణముగా నే దైవమునైనను షోడశోపచారములతో పూజింతురు. సన్నుతియందు వానిలో కొంచెమించు మించుగా నన్నియు కనిపించును. కొండ, కొండమెట్లు, సుప్రభాతము, అక్షయ పాత్ర, విమాన వేంకటేశ్వరుడు, నీరాజనము, దర్శనము మున్నగు

శీర్షిక లత్యంత హృద్యములుగానున్నవి. నీ రూపు, అరూపము, నిర్గుణము, నయన దర్శనము అను భాగములు కవి హృదయ నిష్ఠమైన సగుణ నిర్గుణ తత్త్వభావముల నుదాత్తముగా ప్రకటించుచున్నవి. వారేదో ఉన్నతమైన భావము పెల్లుబికి నప్పుడు కాని పద్యము వ్రాయరు. అందుచే పద్యములన్నియు మనోహర భావనిర్భరములై యున్నవి ఆ భావములు భక్తి సంభృతములై యుండుట వాని కెంతో పవిత్రతను చేకూర్చుచున్నది. భావ మతివేలమై నాలుగు పాదములలో నిముడనప్పుడు వారు వృత్తములందలి పాదములను పెంచిన చోట్లును కలవు. ఈ సన్నుతియందు నాకే కాదు ఏ పాఠకునికైనను ఆశ్చర్యానందములు వెల్లిగొల్పునవి పద్యములలోని కవి ఆత్మీయతా భక్తి పారవశ్యములే.

శ్రీ రామనాధంగారి పద్యముల కూర్పులో నొక నవ్యత కనిపించును. ఛందస్సు ప్రాతదే. అది వారి చేతిలో నపూర్వమైన జిగి బిగువులను సంతరించుకొనును. భావమెంత నిర్భరమో వారి గ్రథనమంత నిబిడముగా నుండును. వారికి లలిత లలితములైన తెలుగు పదములు కూర్చుటయందు ప్రీతిమెండు. ఆ తెలుగు సమాసములు నాతిదీర్ఘములై, అపూర్వ భావ శోభితములై వీనులవిందు చేకూర్చుచుండును. వారి పద్యముల నడక బిగువుగానున్నను ధారా శుద్ధి శోభితమై యలరారుచుండును. వారి భావ ప్రకటన రీతి నవ్యముగా నుండును. భాషపైనింత యధికారము వారెట్లు సంపాదింపగల్గిరాయని నాకచ్చెరువు కల్గుచుండును. ప్రతిభ వారికి భగవద్దత్తము. ఆ ప్రతిభ వారి పద్యములన్నిటిని సరస్వతి కనవద్యములైన అభినవాలంకారములుగా తీర్చిదిద్దినది. ఈ సన్నుతి స్వామి హృదయమున ననుగ్రహమును పఠితల హృదయమున నానందమును వెల్లివిరియించుననుటలో సందేహము లేదు. శ్రీరామనాధంగారు మహాకావ్యకర్త కావలెనని నా ఆశ. వారికా అర్హత పుష్కలముగా నున్నది.

దివాకర్ల వేంకటావధాని.

నా రచనను వాత్సల్యముతో సంస్కరించి
అభినందనము పేరిట ఆశీస్సులొసంగిన
పండితపుంగవులు శ్రీ దివాకర్ల వేంకటావధానిగారికి
నా కృతజ్ఞతలు.

ఔదార్యముతో ఈ పుస్తకమును
స్వీయ ప్రచురణగా స్వీకరించిన
తిరుమల తిరుపతి దేవస్థానముల వారికి
నా ధన్యవాదములు.

వేమూరి వేంకట రామనాథం

# విషయసూచిక

పుట

## ధ్యానస్వరూపము

కరుణాంభోధి ఘనీభవించి యచలాకార మ్మిటన్ దాల్చెనో,
సురలోకాగత శాశ్వతత్వముల రాసుల్ విగ్రహ మ్మాయెనో,
స్వరపావిత్ర్యపు టాదులం దలరు నోజ స్సొల్కెనో లేశమా
త్రరుచిన్ తిర్మల వేంకటేశ్వరుడుగా ధ్యాన స్వరూపమ్ముగా.

అటవుల్ చీకటి గూళ్ళు కట్టికొని నీలాకాశముల్ పర్వ్వ ప
య్యటలో మిన్కను తారకామణుల నెయ్యంబందు నీ కొండ లో
గిట వంతల్ వెతలన్ హరించు ద్యుతి నిక్షేపమ్ము లల్లారు. నీ
స్ఫుట దివ్యత్వ విలాస సూచనలుగా పూర్ణప్రభాహేలగా.

శీతల వాయు చాలనము చిమ్ము ప్రశాంతత. భూధరాగ్ర వి
ఖ్యాత సువర్ణదీధితు లహస్సుల గొల్పెడి ప్రౌఢిమల్. విహం
గాతి మృదుస్వనమ్ములు విహాయస వీథుల నింపు నాక సం
గీత లయానురక్తి. యుబికించును నీ వగు దివ్యతాంశముల్.

వైవిధ్య మ్మొదవించు శైల శిఖర ప్రాభాత రోచిస్సులో
తీవెల్ ప్రాకు సువర్ణ రాసులును. నీ దృగ్ రేఖ లార్ద్రమ్ములై
ప్రావృడ్ వర్షము లట్లు లోయలకు శోభల్ గూర్చు విన్నాణముల్.
దేవా. కంటిమె యిట్టు లన్యగిరులం దెందేని విశ్వంభరన్?

## కొండమెట్లు

తిరుపతి వేంకటేశ్వరుని దివ్య దృగంతరుచిరి పునీతమై
మురిసిన భక్తకోటి పదముల్ రచియించిన మిట్టపల్లముల్;
తరములుగా గడించిన పురాకృత పుణ్యనిధాన రాశికిన్
గురుతులుగా ధరించినవి కొండలు తిర్పతివేల్పునీడలో.

తిరుపతి మెట్లు పృథ్విని కుదించిన స్వర్గముఖోర్ధ్వమార్గముల్;
చరణము లా శిలాగ్రశకలమ్ముల పెన్నిలిగింతలో మహా
త్వరిత గతిన్ గమించు, గుడివాకిట చేరని లిప్తయేని దు
ర్భర యుగమట్లు నిగ్గనని వ్యర్థత కూర్చు తపానుభూతిచే.

కొండలపైని కాపురము, గోపురశృంగము పైడిదొంతరల్,
గుండిగనిండ ద్రవ్యముల కుప్పలు, నమ్రజనాళి కోరికల్
పండిన కన్గొనల్ పఱపు వెన్నెలచిన్నెల కెంపుసొంపులన్
నిండు ప్రభాతరాగముల నిద్దుర మేల్కొలుపుల్ భవన్నుతుల్.

నీ వాల్లభ్యము మించి యున్న దొకటే నీ భూరి కారుణ్యరే
ఖావైశిష్ట్య మనన్య కోమలము: ప్రఖ్యాత ప్రసన్నాతి శో
భావంత మ్మగు నీ మహత్త్వపు టనంతత్వమ్ము బంధించు ప్ర
జ్ఞావైచిత్రిని కూర్చికొన్న దొక భక్తస్వాంత చైతన్యమే.

అందునొ యందదో తొలి యహస్సున దర్శన మన్న యార్తతన్
క్రిందటిరేయి యంతయు నొకే తలపైన కలంత నిద్దురన్
కందిన కన్గవల్ వెలుగుకప్పురముల్ వలె దాల్చి సజ్జనుల్
ముందటి మండిగమ్ము దరి మూగిరి లోనికి గంతు నూపులో.

పూజల యెద్దడిన్ వెనుక ముందుకు సాగెడు వేగుజామునన్
లే జవరాంద్రు కోయిలలు నిద్దురతీరని గొంతు లెత్తి యే
వో జిగులూరు తేనియల నూదెడు వేళను గుంపులై జనుల్
ప్రాజదువుల్ పఠింత్రు తొలి ద్వారము నంటి ప్రతీక్ష సేయుచున్.

కోవెల ద్వారముల్ తెఱచు కుంచిక రొండినిదాల్చి వచ్చు నెం
తో వడి ధన్యజీవి యెదియో తొలి పున్నెము చల్వః చీకటుల్
చేవ తొఱంగి సంజలు హసింపకమున్నె త్రపా వివర్ణతన్
పోవను నెందు లే నటులు పొక్కి ముడుంగుచు పోవు వేళలన్.

"కౌసల్యా" ది పదాళి సంశ్రవణ యోగ్యస్వాన మాధుర్య ధా
రా సంశోభితమై నగాగ్రగత గీర్వాణ ప్రతిధ్వాన వం
శీ సంయుక్తమునై యుషస్స్మిత నవ శ్రీహేమరేఖాంకితా
శాసర్వస్వము నింపు పుణ్యమయ దృశ్యం బెంత యుత్కృష్టమో.

హృది నిను నిల్పి వేకువ పఠించెడు పావన సుప్రభాతపుం
బదముల కూర్పు క్రొవ్విరులు పర్విడి తేనెల జల్లుః శబ్ద సం
పదగతిబద్ధమౌ నమరవాద్య మృదంగ రవమ్మొ, యందునన్
బొదివిన భావముల్ కడలి పున్నమలోతుల య ట్లగాధముల్.

అరుణిమ నింగి సోకకయె యాలయ గర్భము చెంతజేరి సుం
దరగతి సుప్రభాతము మనఃప్రమదోజ్జ్వలతన్ నిమీలిత
స్థిర నయన ద్యుతి స్థగిత తీక్ష్ణతతో పఠియించు సజ్జన
స్వరముల మేలుకొల్పుల యుషస్సులలో కనులార్తువే ప్రభూ.

అది భ్రమగాని, సత్కవి మహర్షుల కల్పనగాని, మంగళ
ప్రదముగ నిన్ను తమ్మువలె భావనసేయు ప్రజోహగాని, యీ
పదియును నాల్గులోకముల భావిభవమ్ములు దిద్దు నీ యెడన్
నిదురయు జాగృతి స్థితియు నెట్లగు భిన్నదశల్ మహాప్రభూ.

చాటుగ జిక్కలం దణుమసాగిన రాతిరికన్నె కంటిక్రొం
గాటుక చారలం దరుణకాంతులు విచ్చిన యెజ్జజాజి పూ
బాట లమర్చువేళ, గిరి పంక్తులు నీదగు సుప్రభాతమున్
మేటి యెలుంగు వల్లరిగ మీటును మంద మరుద్విపంచిపై.

తిరుపతిలోన కాలిడినదే సరి యెంతయొ తల్లడిల్లు నా
చరణ శిరమ్ముగా నొడలు; చూడ్కులు కొండలపైని స్వర్ణ గో
పురము పయిన్; తలంపు లట బొల్చిన నీ ప్రణవస్వరూపసుం
దరత పయిన్; ముడుల్వడిన నాడులు నీవను నేదొ యూహపై.

ఎన్నియొ గంట లాయెగద యిచ్చట కొండకు వచ్చి కాని నీ
సన్నిధి దక్క సూచనల సవ్వడియున్ వినరా దదేలొకో
యన్న బెడందతో గ్రహణమందలి జాబిలిబింబ మట్లుగా
నున్నది నా మనస్సు కుదు రొందక వ్యాకులతావిశీర్ణమై.

అంతటి ముళ్ళయొత్తిడి తనంతనె రూపటి పోయినట్లుగా
స్వాంతము తేటవాఱును భవత్శుభదర్శనభాగ్య మబ్బి న
న్నంతనె. కుంభవర్షపు టనంతర మంబుదనీలముద్ర ర
వ్వంతయు లేని యాకసము వంతున. కాంతిమయ ప్రశాంతిలో.

ఆలయ గర్భమం దరుణహారతిదృశ్య మదెంత సొంపొ. నీ
మ్రోలనె శ్రీనివాసుడుగ రూపము దాల్చిన భోగమూర్తి కా
జ్వాలల హేలలో ప్రథమ భా పరివేష మనంతరమ్ము జీ
వాళి తదేక దీక్ష గమియం దపియించెడు నీ పదాబ్జ రే
ఖాలఘు దివ్యతాంశమున కంతట గ్లౌసుషమాతిరిక్త ప
ద్మాలయమైన వక్షమున కాపయి వెల్గుతుపాను లీను తే
జోలసి తేక్షణమ్ములకు. చూడ్కుల నింపెడు సూర్యచంద్ర శో
భాలలితమ్ము నీ నుదుటి వజ్రకిరీట మయూఖకోటికిన్.

గణనాతీతము నీ యనశ్వర దయాంక స్నిగ్ధమౌ మూర్తికిన్
క్షణమాత్ర ప్రతిబింబమున్ నిలుపు నీ కర్పూర నీరాజన
ప్రణవ ప్రాభవ ఫుల్లతన్ వికచ నేత్రానంద సంవర్ధి యౌ
ఘృణిగా నద్దుకొనం గలట్టి మహితాదృష్టమ్ము నర్థించెదన్.

బారులుతీర్చి నిల్చు జనవర్గము ఱెప్పలు బొమ్మలై నటుల్:
హారతిపళ్ళెరమ్ముగతి నంటి హసించెడి కంటిపాప ల
ల్లారును కెంపుతోరణము లట్టులు. జ్యోతులమాల లట్లు. నీ
హారకణాలు భాను కిరణాళి ధరించెడు క్రొన్ననల్ బలెన్.

అనుకొన నట్టి పూర్వసుకృతాంశము గావలె నేటిరేయి సాం
త్వనసుఖదమ్ము నీ నయన దర్శనలాభము : పూలసొంపులున్
కనకపు భూషలున్ నొసట కస్తురి పూతలు లేని దివ్య వీ
క్షణరుచులన్ శిలాగత నిసర్గతలో కనుగొంటి నో ప్రభూ.

నిన్ను పదేపదే తలచు నిశ్చలతన్ కరుణింపవా ప్రభూ.
కిన్నెరకన్నె లంచెలుగ కేరి యొనర్చు ప్రమత్తలాస్య సం
పన్నవహేల లందున ప్రభూ. విభవోజ్జ్వలమైన కొండకున్
క్రన్నన లెక్కలేని గతిగా నరుదెంచు నదృష్ట మీయవా?

భూరి నగాగ్ర భూషగ నభోవిభవమ్ముగ నిల్చియున్న స్వ
ర్ణారుణ గోపుర ద్యుతి యుతాలయ గర్భమునందు నేదియో
కోరికమై నినున్ దరియ కుండెడు విజ్ఞత నీయవా. భవత్
శ్రీరుచి సిద్ధియే తనివి తీరని బుద్ధిగ చేయవా ప్రభూ.

కొలతకు చేతు లుండవలె. కూరుకు పోయిన హుండిలోని సొ
మ్ములు నగలున్ నిరంతరము పుష్కలధారగ రాలు నీ షరా
ఖుల యొడులందు: ప్రత్యహము ముట్టిన మొత్తము నీ
సమక్ష మం
దెలుగులనెత్తి భూతచయ మెల్ల వినన్ జదివింతు రింపుగన్.

ఇది మా వెట్టియె కాదొకో: యతులమౌ పృథ్వీపరివ్యాప్త సం
పద సర్వస్వము నీదియే యయిన నీ పై కమ్ములున్ పైడి నీ
కొదవెన్ నేడని హెచ్చరింపుగతి పల్కుల్ పల్కుటల్ చెల్లునే?
విదిత మ్మయ్యును చిక్కరాని ముడి నీ వృత్తాంత మెన్నాళ్ళకున్.

నీ దే నాటిదొ యప్పు తీర్చు వరుసన్ హేమమ్ము ద్రవ్యమ్ము స
మ్మోదోద్రిక్తత నీదు ప్రీతి కయి నీ మ్రోలన్ సమర్పింత్రుః ప్ర
జ్ఞాదౌర్బల్యము జేసియేమొ. జితవాంఛాస్నిగ్ధ చిత్తమ్ము నీ
పాద చ్ఛాయలలో సమర్పణ మొనర్పన్ నేర్వ లేకో ప్రభూ.

తరుణ ప్రాభవ సంభ్రమోల్లసిత గంధర్వాంగనల్ మెచ్చు సుం
దర రత్నాంచిత రుక్మ భూషణము కన్నన్. భాగ్యసల్లాప సం
భరితుండైన కుబేరుడున్ వలచు ద్రవ్యశ్రేణి కన్నన్. వసుం
ధరకై జాలి గలట్టి బేలహృది కాన్కన్ సేయ మేలౌనుగా.

పచ్చలు నీరసించిన విపన్న లతాంతము రే కుదుళ్ళలో
వెచ్చని బాష్పబిందువులు వృష్టిగ రాల్చెడు జాలివాలు నీ
విచ్చెద వేమొ నా కనుల కింతగ. నావలి తూర్పు కూర్పులో
వచ్చెడు సంజతెమ్మెరల వంపుల తీవెమొనల్ చిగుర్చగన్.

స్వామీ, నీ దరహాస చంద్రికల విస్తార ప్రభావృష్టిలో
కామ క్రోధ మదాది శాత్రవ గణాక్రాంతమ్ము నా స్వాంతమున్
ప్రేమన్ స్నిగ్ధ మొనర్చి నీ యెడనె కేంద్రీభూతముం జేసి, యా
శామాలిన్య తమస్సు చీల్చగల తేజ స్సింతయేన్ చిల్కవా?

మనసును దుష్టచింతనకు మారని తీరని రీతి నెన్నడో
పణముగ నొడ్డియున్న జనవర్గము సైత మిటన్ భవద్విలో
కన కరుణార్ద్రతన్ కనుల గప్పిన కారుతెఱల్ తొలంగ ద
ర్పణము విధాన దాల్చు తన స్వాంతము నీ ప్రతిబింబసిద్ధికిన్.

నింగికి నూయలల్ బఱచు నీరధి శయ్యల పైని నావగా
క్రుంగుచు పొంగు నా యెడదకున్ స్థిరతన్ కలిగించు నాసతో
లంగరు నెంత జార్చినను రత్నము లంటునె గాని శ్యామలో
త్తుంగ తరంగ ఘర్షణలు దూరని ధారుణి తాక దేలొకో.

నిచ్చలు పారు నీటి కరణిన్, సొలపింతయు లేని ఱెక్కలన్
విచ్చి చలించు గాలి సరణిన్ కడు చంచల మన్న, నంతకున్
హెచ్చగు నా యెడంద, యది యెట్లన నీరము నిల్చుపాత్రలో,
నచ్చము స్తబ్ధమౌ ననిలమైనను వేసవి మండు టెండలో.

పంతము మీర నా చపల భావ పరంపర త్రోసిపుచ్చి నా
స్వాంతము నందు నిన్ నిలువ బట్టిన నంచుల దన్క, చిత్ర మా
ద్యంతము లంతు పట్టని విధమ్మున నిల్చియు నిల్వవేమి, నీ
కింతటి చంచలత్వ మని యెన్న డెఱుంగను వేంకటేశ్వరా.

నిగనిగ లాడు నీ చరణ నీరజ రేఖల నంటి యుంట న
ట్లుగ ననయమ్ము దివ్యరుచిలో విలసిల్లెడు పళ్ళెరమ్మునన్
ధగధగ లాడు మేల్పయిడి తళుక్కుల చిమ్మెడు నీదు పాదుకల్
తగిలియు తాకనట్లు నను దగ్గఱి ముందల నంటు లిప్తలో.

ఏవో యెన్నడు కాన నట్టి వెలుగుల్ పృథ్వీ తలాసాధ్య శో
భా విన్యాసముతోడ నాదు కను ఱెప్పల్ కంపిలం జేసి న
ట్లేవో యెన్న డెఱుంగ నట్టి రవముల్ గీర్భాషణోంకార భా
వావేశ మ్మొదికించు నట్టు లనిపించున్ పారవశ్యస్థితిన్.

ఆదివరాహుడే తన విహారములో నొక కొంతమేర ని
న్నాదు కొనంగ నిచ్చెగద యప్పటి లెక్క నలంతి యద్దెపై
నేదొ కుటీర మొండు వెలయించి వసింతు వటంచునెంచి. నీ
వో దొర వోలె పైడిపొర లూదిన గోపురమున్ వెలార్చుటే
కాదు కనుల్ కదల్పకయె కాన్కలు కొల్లలుగా గడింతు వే
లాది జనుల్ త్వదీక్షణ విలాసము నందగ వచ్చు వేళలన్.

పాపమ్ము ధనదాయకాచలపు భూస్వామిత్వమున్ గల్గియున్
నీ పైకమ్మున నల్పభాగ మయినన్ లేకుండ. కోనేటికిన్
దాపై నిల్చిన చెట్టునీడ నొక పొంతన్ చిన్నిగేహమ్మునన్
నేపథ్య ప్రతిమా విశేషము వలెన్ నీ యన్న నిల్వంబడున్.

అన్నకు నీవు స్వల్పమగు నద్దె యొసంగిన నేమి యాయె. నీ
కున్న ఋణమ్ము లన్నియును నున్నవి యున్నటు లున్న
వెన్ని సం
పన్నిధు లంతు లేనటులు వచ్చిన. నే గతి యప్పుపత్రమం
దున్నవొ వడ్డి చెల్లు షరతుల్ పరిశీలన చేసినా వొకో.

కొలతన్ దస్సి పరుండె పాప మిచటన్ గోవిందరా జింక నెం
తలుగా కాలము సాగి పోవలెనొ యేనాడో కుబేరుండు తి
ర్మల వెంకన్నకు నిచ్చి యున్న ఋణ సర్వస్వమ్ము చెల్లాట కీ
కలికాల భ్రమణమ్ము చాలునొకొ. నిక్కం బిద్ది మా మంచికే.

పలు నెఱవుల్ గమించి, జడివానల కొంతగ, మంచుముద్ద వా
కల మఱి కొంతగా, నవని గర్భముపై కుబికించు నూర్ధ్వ ధా
రల వడి కొంత, భూధ్ర నికరాగ్రములన్ జలపాత భీష్మ శ
య్యల నొక కొంతగా, జలము లైక్యము నంది నదీనదమ్ములై
కలిసి నిజస్వరూపముల కల్పన వాసి విశాలరత్న గ
ర్భ లహరులై మెలంగెడు తెఱంగున, భిన్నములౌ ప్రవృత్తులన్
కలిమిని, లేమి, భక్తి, భయకంపన, కోరికలన్, విరాగ ని
శ్చలతను దొర్లి వచ్చు ధనసంపద భూషణరాశి నీదు చా
యల కమనీయ పీతవసనావరణాక్షయ పాత్ర లోనికిన్.

ఎచటిదొ యీ సరోవర మదెట్టిదొ యన్న ప్రసక్తి లేకయే,
ప్రచలితమైన భానుపదపంక్తిని నావిరులైన నీరముల్
విచలిత నీలమేఘముల వేసమునంది మరుత్ప్రమోదమం
దిచట క్షుధార్తి దీర్ప నరుదేరవె జీవసధారలై క్షితిన్.

అది నిమేషమ్ములో సగమె యయ్యు ననంతముగా స్ఫురించు నీ
పదముల కింతమేర మురిపమ్మున దగ్గఱి నవ్వు డెన్ని యు
ర్వ్బదముల యేండ్లు నీ యెదుట బోరలపడ్డ క్షణాంతరమ్ములో
నది త్రుటిమాత్రమౌ కల యటంచు భ్రమింతు నిదేమి చిత్రమో.

క్రిందటి మాటికన్నను సమృద్ధ కృపాకృతిగా స్ఫురించె దీ
వెందులకో. యవే కను లవే పదముల్ కరపంకజమ్ములున్
ముందుకు మొగ్గు నీ యభయ ముద్రయు శంఖము చక్రమున్ సదా
యందము లొల్కు గడ్డమున కంటిన మచ్చయు మున్ను కన్నవే.

ఎన్నటికన్న మించిన యదృశ్య మనోజ్ఞతయున్ గభీర వి
ద్యున్నవ దీప్తియున్ విరిసియున్నవి నీ మొగి నే డిదేలొకో:
మున్నను దేవళ మ్మిదియె. మూర్తియు నీవదె. భూషణాళి సం
పన్నతగొల్పు వెల్గు లవె. ప్రక్కల విగ్రహపంక్తి యద్దియే.

నీ దివ్యత్వములో ననుక్షణము సందీప్తాధిక స్ఫూర్తి యే
దో దట్టమ్ముగ నిండి యుండవలె సద్యోవిస్తృతి ప్రౌఢిమన్:
లేదా. యెప్పుడికష్టె నీ కనుల భూరిజ్యోత్స్నలో ప్రాతవౌ
నీ దృశ్యమ్ముల జ్ఞప్తి పల్చపడునో నిర్నిద్రమౌ నా హృదిన్.

నాకే యచ్చెరు వౌను. నా కనుల నీ నా డాలయమ్మందు సు
శ్రీకారుణ్య మయమ్ము నీ యతుల రోచిర్మూర్తి పై నట్టు లే
యేకాగ్రోజ్జ్వలతన్ లగించు తఱి నాహృత్సీమ యాశావిము
క్తాకారమ్మున మేఘముక్త శరదాకాశమ్మునా నొప్పెడిన్.

ఇది క్షణికస్థితి ప్రమదమే యగుగాక మొయిళ్ళదాటులో
చదలున కింత యింపొసగు చక్కిలిగింతలు శంప లట్లు. బు
ద్బుదముల సంజకెంపు లటుః పున్నెము పండక పోశయున్నె. యొ
క్క దినమునన్ తథాస్తని యఖండపు దీవన లొల్కబోయవో.

ననలం బొల్చు వసంత వల్లరుల చందంబూగు నా నెమ్మన
మ్మున నీ ప్రేమోలను నేడు పొంగవు తలంపుల్ కోర్కెలై. చిత్రమౌ:
నిను దర్శించిన వేళ కోర్కె యెదియున్ నిర్దేశమున్ జేయనే
రని ప్రజ్ఞా నిశితత్త్వ దీక్ష త్రుటి కల్గంజేయు మా స్వామి యం
చనయమ్మున్ నిను వేడుకొన్న నిశితోహం జేసియో. లేక. నీ
కనుచూ పోరగ మందహాసగతి చీకట్లూరు నా మేనిపై
క్షణమాత్రమ్ముగ పర్వియున్న తటి నస్పష్టంబుగా హృద్యమౌ
ప్రణవప్రోత్థిత పారవశ్యజనితంబౌ విస్మృతిం జేసియో.

అభయ సుధా ఝురుల్ ప్రిదులునట్టి భవన్మృదుహస్త వారిజ
ప్రభఁ గనిపించు నెన్నియొ ప్రపంచములందలి భూత సంచయ
క్షుభిత వివర్ణతల్ సరసకోమలతల్ నడయాడు నట్టులున్
శుభముల పంట లాకసముచూరుల నంటిన యట్టులున్ ప్రభూ.

నీ యరచేయి చిమ్ము రమణీయ మయూఖము లందు బింబితం
బై యగుపించు మానవుల యాసలజోతుల కెంపువెల్లువల్,
రేయిపవళ్ళు నీ కృప ఫలించిన సుస్థిర మానసోద్ధత
శ్రేయములోని రాగధుని చిన్నెలు సంజల వంపు క్రొన్ననల్.



మదిలో నెన్నియొ నాళ్ళు గుప్తముగ సంభావించి యున్నట్టి దె
య్యదియో కోర్కెను నీ సమక్షమున నేకాగ్రప్రశాంతస్థితిన్
విదితమ్మౌ నటు లుచ్చరింప దొడగున్ విజ్ఞాళియున్, చిత్రమౌ
గద, సర్వజ్ఞుడ వీ వటం చెఱిగియున్ కారుణ్యవారాన్నిధీ.

అడుగక యమ్మయున్ పిడికె డన్నము పెట్ట దటన్న ప్రాతదౌ
నుడికి నుదాహృతమ్ముగనొ, నోటిని దాటని తేటమాటలన్
బిడియము కళ్ళెముల్ బిగువు వీడని మంద రహస్యపై ఖరిన్
వడి వడి చెప్పుకొందురు భవత్ శుభదర్శన హర్షవృష్టిలో.

తెలియని యట్లు నీకు తమ తీరు, మనస్థ్సలి లోభసస్య తుం
దిల మగు సాగు వంటిదని. తీరము లేని మనోరథాబ్ధి యం
చలసట లేని చంచలత యబ్బిన పక్షలసద్విహాయసో
జ్జ్వల శకల మ్మటంచును నిజమ్ముగ నాసల పుట్ట యంచునున్

ఒక పరి మందహాసమున నుబ్బిన బుగ్గలు ప్రేమసంభృతాం
బకమును దక్క హేమమయ వజ్రముగా నిలువెల్ల తోచు. నిం
కొక పరి మేలి పూ లతల కూర్పుల సౌరభరాశి వోలె. వే
ఱొక పరి యే జిలుంగులును నోర్వని నల్లని రాయి వోలికన్.

చలనము లేని యట్టి శిల చందము నీవని యెంతు నన్ను. నా
తలపుల పళ్ళెరమ్మున మొదల్ తుద లేనటు లంచు లేని పొం
గులు గద నీ కృపాలసిత కోమలతల్. మఱి నీదు రూపు రే
ఖల గతి నా మనః స్థితుల కల్పన యెట్టులొ యట్లె యౌనొకో.

తిరుపతి కొండనీడ కరుదెంచియు కోవెలలోన జొచ్చి నీ
కరుణ స్రవించు కన్గవను గాంచగ నేరని బేలవారు మం
దిరమునకున్ ప్రదక్షిణము దీక్షగ చేసి విమాన వేంకటే
శ్వరు కనులార మ్రొక్కి మఱు సారికి నట్టులు చాచి పోవరే.

మురియుచు లోన దర్శనము పొందియు వెండి విమాన వేంకటే
శ్వరునకు సైత మంజలి నొసంగక కోవెల వీడ రెంతకున్:
మఱియొక మాట. ప్రక్క హనుమానునికిన్ బొనరింతు రంజలుల్
పరమ పవిత్ర రాఘవ జపస్మరణోద్గత శక్తిశాలికిన్.

అరయగ నేదొ లోతయిన యర్థము లేదె విమాన వేంకటే
శ్వర విభు దర్శనమ్మునకు. బాణము లట్లుగ నెక్కువెట్టి సు
స్థిరముగ నిల్పు చూపు లట తీర్చిన బొమ్మలు దాటి. పైడి గో
పురమును దాటి. యంబరము పొత్తిని జొచ్చుక పోవుగా వసుం
ధరలు సహస్రముల్ కలసినట్టి యనశ్వర విశ్వవీథికిన్.

గిరులను దాటియున్ చదలు కెంపుల సొంపు మొదళ్ళుమించి. నీ
గుఱుతుల బాట లేవా వెదకున్ జడతన్ మమతన్ కనుల్ నినున్:
తెఱచియు మూత వడ్డ వివి తీరని కోర్కులు పేర్చు చీకటిన్.
నిరతము నల్గడల్ పొరలు నీ ద్యుతి చిహ్నములన్ గ్రహింపకే.

ఎంతలో దూరముల్ శ్రమ యదృష్టవిధమ్ముగ నెంచి, ప్రౌఢ సీ
మంతిను లష్టదిక్సతుల మంజుల గండ విలాస శోభ అ
త్యంత ముదప్రమత్తత సమన్వయ మందిన యీ నగోపరి
ప్రాంతము చేరవత్తురు భవత్కరుణాకృతి గాంచ సజ్జనుల్.

కొండలు దాటి యేడు గుడి గోడలు చేరు టదొక్క యెత్తు: వే
ఱొండుగదా చలింప నటు లూగుచు నాగుచు, పంక్తినంటి ము
న్మండిగమేని దాటుట, క్రమమ్ముగ చేరుట ప్రాకినట్లు బ్ర
హ్మాండపు టద్దమైన భవదాలయ గర్భములోన నెట్టులో.

ఇంతకు నీ సమక్షము లభించుట యే నిముసమ్ము సేపొ, ని
శ్చింతగ నిల్చి యా యచల చిన్మయ గోళయుగమ్ముగాని హ
స్తాంత నిసర్గ చిహ్నములు శంఖము చక్రముగాని, శ్రీస్మితా
క్రాంత విశాల వక్షమునుగాని, నిగూఢముగా కుదించి యే
కొంతగనైన కన్గొనల కూర్చి కొనంగను లేనుగా ప్రభూ,

నీ నగుమోము సొంపులకు నింతగ దగ్గఱ నిల్చి నాదృశల్
సోనలు చేసి నీదు కొనచూపుల వంకనె చూచుచుండినన్
కానగలేను నీ విపుల గాత్రము, చిత్రము, దేవళమ్ము చూ
రానిన వెల్గు వెల్లువ తరంగము లల్లిన నిండు టావిరిన్.

నాకున్ నీకును మధ్య నాల్గడుగులై నన్ నీదు వాల్చూపదె
న్నో కల్పమ్ములు యోజనమ్ములుగ హాసోల్లాస సంపన్నమై
లోకానీకము చుట్టి వచ్చు చిపుడెట్లో నాకుగా నిల్చె నీ
ప్రాకారమ్మున నంచు తోచు, క్షణమాత్ర మ్మంతలో మెల్లగా
ప్రాకున్ కోవెల దాటి యంచు తన విశ్వానంత యానమ్మమై.

ఉరలెడు గోలకమ్ము లటు లున్నను కన్నులు వత్సలత్వ సుం
దరతను వెన్నముద్దల విధమ్మున చెమ్మగిలున్. శిలాధను
స్థిరగతి నున్న కన్బొమలు చిన్మయ పూర్ణదయా సుధార్ద్రితల్
మెఱసెడు పూలతీవెల వలెన్ కదలాడు నలంతి పుల్కలన్.

నీ నతవీక్షణమ్ము గమనించు కొలంది నిటే ప్రసన్న శో
భానిల మంద డోలికల వంపులలో దిగి వచ్చినట్లుగా
కానగ వత్తు వంతటనె కన్నులు చించుకు చూతునా. యథా
స్థానము నందె యుందువు గదా. యిది యెంతటి భ్రాంతియో

ప్రభూ.

ఎంతకు తీర నట్టిది సహేతుక సంశయ మిద్ది. నీవు నా
చెంతకు వచ్చి నా వికల చిత్తములోన స్థిరైక్య మందెదో.
వంతల మూట నా యొడలి ప్రల్లదనమ్ము నిగిర్చి నేనుగా
నంతము లేని విశ్వరుచి యందు వెలుంగయి లీనమౌదునో.

ఫలిత మొకండె రెంటను. భవత్కృప యొక్కట నాప్రయత్నమం
దలి పస వేఱు మార్గమున నంచు భ్రమింతును గాని: తేనె సో
నలు పులకించు పూవుల తనంతనె చేరదె తేటి. తేనె చా
యలకును నోచనట్టి విరి కందునె తన్మయ భృంగ సంగతుల్ ?

రూపము లేని దివ్యతకు లోచనముల్ కరుణామృతార్ద్రధా
రా పరిధుల్ బలెన్, భయ నిరాకృతి తర్జనిగా, నిరంతర
శ్రీ పరిపూర్ణ వైభవ విశిష్టత వక్షముగా వెలార్చె నీ
రూపుగ నీ నగాగ్రములు లోకుల నిశ్చల బుద్ధి సిద్ధికై.

నీ రూపమ్ము నిమీలితాక్షి యుగ సందీప్తమ్ముగా నిల్చి, యా
శా రోచిస్సుల దన్క నూగిసిలు నా స్వాంతమ్ముపై శృంఖలల్
బారుల్ తీర్చినవేళ, నా తనువు సర్వస్వమ్ము నీవై, భవ
త్కారుణ్యచ్ఛవి నేను నైన యమరత్వ ప్రాప్తి నర్థించెదన్.

ఆ నిముసమ్ములో దశదిశాంతముగా విలసిల్లు నీ గభీ
రానన హేలలో స్ఫురణ మౌను సమస్త జనానుభూతులున్,
కానని భూతజాలము సుఖమ్ములు వేదన లార్తు లూర్పులున్;
నా నత హృత్సుమమ్ము కరుణా మధు బిందు విగాహితమ్ముగున్.

సర్గము మీర తా మొసగు సంతత హారతులున్. ప్రలోభ సం
సర్గము పేర్చు మ్రొక్కుబడి సంచులు. నీ ప్రియతన్ వరించు స
న్మార్గము లంచు నెంచును భ్రమన్ గురు పండిత కోటిసైతమున్:
నిర్గుణమైన దివ్యతకు నెన్ని గుణమ్ముల కల్పనమ్ములో.

ఎఱిగి యెఱుంగ కీ గతి నివృత్తి పథమ్ముల యంచు లందు కొం
దురో తనువున్ మనమ్మును ధనోద్ధతి కొంతగ ధారవోసి నీ
కొఱకు. వినీలమౌ జలదగుచ్ఛము పృథ్వికి సస్యసుందరాం
కురముగ జీవనమ్ములను గూర్చుచు తానె యదృశ్య మౌనటుల్.

నిను దర్శించిన నేత్రయుగ్మమునకున్ పృథ్వీతల మ్మెల్ల దు
గ్ధ నదీశ్వేతముగా స్ఫురింపవలె నాంధ్యమ్మంట నట్లే. గులా
బిని ముల్లున్నది కాక తేనియల తీపిన్ చిప్పిలంజేయు నూ
తనరేఖారుణ మంజులత్వ మొకటే తట్టన్ వలెన్ నిచ్చలున్.

నిను కీర్తించిన నాల్క సార్థకతతో నింపొందు టెట్లన్న. జీ
వన సర్వమ్మున రాగభారభరితంబౌ శబ్దపారుష్య ని
స్వనముల్ దొర్లగరాదు. కార్మొయిలు వర్షం బిచ్చు నిల్లాలుగన్.
ముసు చీకట్లను సంజచేడియలుగా నుత్ప్రేక్ష చేయన్ వలెన్.

నిను ధ్యానించినమాత్ర పొందునె ప్రశాంతిన్ చిత్త మీ ధాత్రి నె
ల్ల నదృశ్యమ్మగు నీదు దర్పణము లీలన్ గాంచ లేకున్న. వే
దనలో వేసవి గొంతు లారిన శకుంతశ్రేణి యందున్. తుపా
నున మట్టమ్మగు పత్రపుష్పచయ మందున్. జాలిపెంపొంద కు
న్న నిసర్గానుభవమ్ముగా నవ మరందామంద భంగాళిగా.

చెదరిన యెండుటాకులను చేవతొలంగినరేకు తున్కలన్
కుదురుగ పేర్చి కుప్పగ. నిగుర్చుకుపోయిన తేనెబొట్ల పూ
పెదవుల నాపయిం బఱచి. భృంగము జీరిన నేమియౌను ? తు
మ్మెద మధుసౌరభభ్రమ తమిన్ పరతెంచునె యారగించగన్ ?

తిరుపతియాత్రమాత్ర మొక తీరును జీవనయాత్రయంతయున్
మఱియొక తీరునైన ప్రజ మాంద్య తమస్సున తప్పుదామె సం
బరమున మోసపుచ్చుకొనువారలు: భక్తికృతుల్ ప్రవర్తన
మ్మరదము రెండు చక్రముల యట్టులు సాగవలెన్ సమప్రభన్.

## నీ చిన్నెలు

వనమున మండుటెండసెగ పైకొను కొమ్మలనీడలందునన్
కనలుచు సోలి యాకలి సగమ్ముగ చిక్కిన బిచ్చగాని చి
న్గిన యొడి మావి పిందెలను నేర్పున రాల్చెడు గాలివాలులో
కన నగు నీదు చిన్నెల వికాసము కన్గొనగల్గువారికిన్.

చనుగవ పాల చాటికల సంభృతిలో నభమున్ శుభమ్ము నే
ర్వని పసిగందు బోసి యధరమ్మున తొణ్కిస లాడు నవ్వులో:
తన కబళమ్ములో సగము తన్మయతన్ తన బిడ్డనోట మె
ల్లన దిగజార్చు కోకిలగళమ్మున సంబర ముబ్బు వంపులన్:
పుణికిన నిండుజవ్వనపు పూపొదరిండ్ల రుచుల్ ప్రజాహిత
మ్మునకయి తేనెతుట్టెలుగ బొల్చెడు తేటి యనంతరఝంకృతిన్:
ఘనతను నీటితుంపరలుగా ధరజిమ్ము మొయిళ్ళనీలిమన్:
కన నగు నీదు చిన్నెల వికాసము కన్గొనగల్గువారికిన్.

## నీ దివ్యత్వము

ఏదొ యమర్త్యతేజ మిటకే దిగివచ్చి ప్రసన్నశిల్ప కా
వ్యోదయ సమ్మితం బయిన భూధరశృంగము నందు నీవుగా
పాదుకుపోయి యుండవలె. పన్నుకుపోయినవేళ్ళు బారులై
మేదినిదాటి దివ్యఫణిమీద నిలంబడియున్న తీరునన్.

లేదా లెక్కకు మించు వర్షములుగా రేయింబవళ్ళాకసం
బా దేశించినయట్లు వ్యగ్రమగు చిత్తం బంజలిందాల్చి శ్ర
ద్ధా దీక్షాంకితమైమెలంగు గద భక్తశ్రేణి యీ కోవెలన్
నీ దివ్యత్వము మా హృదంతరములందే పుట్టునో మెట్టునో.

అంతములేని పంక్తుల కహర్నిశ మెట్టులో దళ్ళుకట్టి యే
కాంతము నీకు గూర్చెడు ప్రయత్నము వ్యర్థముగాదె. యష్ట ది
గ్దంతుల మూపురమ్ముల నదల్చుచు వచ్చిన పంచభూతముల్
బంతులు తీర్చియున్నవి భవచ్ఛవి నంద నిశారహస్థ్సితిన్.

లేదేన్. నందనపుష్పసౌరభమువోలెన్ నేలకుం గ్రొత్తయౌ
నేదో హృద్యత గుప్పినట్లు లెటులౌ నీ సుప్రభాతమ్మునం
దీ దేవాలయ గర్భమందు. మఱి సందీప్తమ్ములౌ నవ్యసం
ధ్యా దర్పమ్ములలో వియత్తల రుచుల్ దట్టమ్ములౌ టేలొకో?

నీ రమ్యాకృతి చుట్టియున్న చదలున్. విశ్వోపరివ్యాప్తమౌ
తారామండలసంపరిభ్రమణసంధానంపుటవ్యాజమౌ
పారస్పర్యములో స్వయంజనితమౌ బ్రహ్మాండమున్ నింపు నోం
కారధ్వానము మ్రోయుచున్నటులు. ఝుంకారమ్ము విన్పించెడిన్.

నేలయు నిప్పు నింగియును నీరము తేజము. నా మనోంబు జో
హాలయనాట్యశాలను క్షణాంతర భిన్నములైన రూప రే
ఖాలఘుమంజులత్వదరహాసము లొల్కుచు. నీ సమక్షమం
దోలగమై నిరంతర జవోద్ధతి నందెడు నట్లు తోచెడిన్.

ఆ తటి బ్రహ్మతీర్థము రవంతగ్రహించి. నిశాప్రశాంతిలో
నూతనకాంతిపుంజముల నొందినయట్టి శరారి కెంపు లే
వో తలపైన నంటినటు లూహను సంతసమంది. వానలో
చాతకపక్షి తృప్తిగను చందమునన్ గుడి బైటికేగుదున్.

నీకున్ నాకును నెన్ని యేండ్లుగనొ యందీయందగా రాని శు
భ్రా కాశాంచల నిత్యకాంతి గత సంబంధమ్ము లున్నట్లు. నా
యాకారంపు విభిన్న పూర్వకృతులం దల్పమ్ముగానైన నీ
దౌ కారుణ్యము చిమ్మినట్టులును దృశ్యంబౌ కనుల్ మూసినన్.

దాగుడుమూత లట్టులు. త్వదంఘ్రియుగమ్మును నేను. నీవు నా
రాగవిరక్తియున్. వెదకులాడుచు నుంటిమి యేండ్ల కేండ్లు. నా
రేగిన కారుమాయతెర లెత్తవు నీ విదియేమి యాటయో:
నే గమనించలేను గద నీ గుఱుతుల్ గురుయోగబద్ధముల్.

చూచుకొలంది నీదు సొగసుల్ మునుగాంచని స్వప్నభావనా
వీచిక లట్లు క్రమ్మును ద్రవించిన నా కనుపాప లందు. నే
దో చకితప్రమోదనిధిధోరణి వెన్నెలలున్ తటిల్లతా
రోచియు నీరజాప్తశతలోచనముల్ మిళితమ్ము లైనటుల్.

అంతటి వెల్గు విశ్వనివహమ్ముల పొందికలో హఠాన్మహ
త్త్వాంతవిశేషమై జనన మందియె యుండవలెన్. క్షణమ్ము వి
భ్రాంతి విగాహితస్థితిని వజ్రత నందిన నా కనుంగవన్
వింత జిలుంగు తళ్కు ప్రతిబింబము నింపును స్తబ్ధతాస్థితిన్.

అది స్థిరబద్ధకాచ నయనామల లక్షణ మేమొ గాని. నా
యెదుటనె నిల్చియున్న భవదీక్షణపంక్తిని గాంచలేను. నీ
పదములనంటు కప్పురపుపళ్ళెరమున్ గనలేను. రత్నముల్
పొదివిన కంఠహారముల పుత్తడిపోడిమియున్ గనన్ ప్రభూ.

నీవే యీ వెలుగైతివో. దెసల సంధిన్ వెల్గువౌ కాంతి రే
ఖా వాల్లభ్యము సోకి సర్వము సితాంకస్నిగ్ధమౌ వార్ధి ఫే
నావిర్భావము పొందెనో యొకటె దృశ్యంబైనటుల్ నల్గడల్.
నీవున్ నేనను భిన్నకల్పనల కేనిన్ తావు లేనట్లుగన్.

వెలుతురు కన్న ముందు వినిపించు శకుంతరుతిస్రవంతిలో
నలసటలేని తెమ్మెర రయమ్మున చిమ్ము సుమామృతమ్ములో
నలగని యెఱ్ఱకల్వలమొనల్ కులికించు నలంతి సంజలో
కలిగిన నిన్ను వేఱ కనగా చన నేటికో తిర్మలాద్రికిన్?

ఇరు లెగ దువ్వకొన్న జడ కింపగు వెల్గువిరుల్ వెలార్చు వే
వరుసలఱెక్కలన్, సొలసి వంగిన రోదసి మేనునిండ క
ప్పురముపొడుల్ తరంగముల పోలిక నింపెడు పండువెన్నెలన్,
వఱలెడు నిన్నుగాంచ పయనమ్మగు టేటికో తిర్మలాద్రికిన్?

బీటలువాఱి మండుసెగవేడిమి నూదెడు నెండునేల యా
రాటపుగొంతుకల్ తడిసి, క్రమ్మఱ క్రొన్ననవేళ్ళుప్రాకు న
ట్లీటెల కన్నతీరుగ, మొయిళ్ళుపొదిన్ విడిరాలు చిన్కు లం
దేటికో కాంచలేక పయనించుట నిన్గన తిర్మలాద్రికిన్?

జాలియు ప్రేమ తృప్తి ఋజుసౌమ్యత నాలుగుగోడలట్లు, లో
భాలసతల్ విడంబడిన భావన యున్నత గోపురమ్ముగా,
నీ లలితప్రభాపరిధి నిండిన స్వాంతదళ మ్మనంత గ
ర్భాలయ మట్టులుండగ, ప్రయాణము లేటికి తిర్మలాద్రికిన్?

ఐనను తిర్మలాగ్రపు విహాయస మందలి సంజరేకలన్,
తే నగువన్నెప్రోవులగు ఱెక్కల, తేనియవాకవెన్నెలన్,
వానల, నెండులేని ప్రణవద్యుతి దాగిన దాగుగాక, నా
మానస మందిరానికి సమంబగు కోవెల యెందు నున్నదో.

ఎప్పుడి యూహలప్డై పదహృద్యత భావ నిసర్గలీలమై
చెప్పితి వృత్తసంకలితశృంఖలముల్ దవిలించి. యందునన్
కుప్పలుగా విభిన్నసుమకోమలతల్. మధుమాసభూషలై
యొప్పనుగాని నిల్వ దెదియో యొకటీ విరిగుత్తియై ప్రభూ.

మొత్తముగా గలట్టి తలపొక్కటె. నిర్గుణమై యరూపమై
సత్తెము సుందరమ్ము శివసంభృతమై యలరారు దివ్యతన్
చిత్తమునన్ కుదించుటయె చిన్నెలుగా నయినన్ రవంత. హృద్
భిత్తికలూడి యైక్యము లభించుటొ విశ్వరుచిస్రవంతిలో.

నిను ధ్యానించిన లిప్తయందు హృదిలో నే భావశంపాస్మిత
మ్మనుభూత మ్మగునో యెఱుంగ. బహు భూషాలంకృతమ్మైన మూ
ర్తిని కన్గొందునొ. పారవశ్యమున నీ క్రీగంటివాత్సల్యమం
దణుమాత్రైక్యము నందిన ట్లగునొ. యవ్యక్తమ్ముగా చేర జూ
తునొ విశ్వమ్మున సంచరించు వెలుగేదో కాంచి యూహావధిన్:
మననమ్మో ననుభూతి కద్దముగ ఛందస్సల్లితిన్. దీని క
బ్బిన నబ్బందగు నీ నిసర్గమగు వైవిధ్యంబె దృక్కోణ క
ల్పన సారస్యము లందు నే నెఱుగకే బ్రహ్మాండ రోచిర్నిధీ.





వేమూరి వేంకట రామనాథం

ఆంధ్ర విశ్వవిద్యాలయములో యం. కాం. (ఆనర్సు), పిహెచ్. డి. డిగ్రీలను పొంది, లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్‌లో విద్య నభ్యసించి లండన్ యూనివర్శిటీ నుండి పి హెచ్. డి. డిగ్రీ నందిరి.

ఆంధ్ర విశ్వవిద్యాలయములోను, ఉస్మానియా విశ్వవిద్యాలయములోను 1970 వరకు అధ్యాపకులుగాను, ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ ఎంటర్‌ప్రైజ్‌కు డైరెక్టర్‌గాను నుండిరి. పిమ్మట యునైటెడ్ నేషన్సు (న్యూయార్కు) లో అడ్వయిజర్‌గా చేరిరి.

## ఇతర రచనలు

సంయుక్త (గేయ నాటిక)
చంద్రరేఖ (పద్య సంపుటి)
సౌందర్య సమీక్ష (సారస్వత వ్యాసములు)
బిచ్చగత్తె (సాంఘిక నాటకము)
చందల (చారిత్రక నాటకము)
ఉగాది రాత్రి (కథల సంపుటి)
నాగార్జునకొండ (గేయ నాటిక)
కమల (నవల)

*Printed at T. T. D. Press, Tirupati.*